Registered No. M-4484.

# యుద్ధ సంచిక

వాల్యూం II.] 1942 వ సం॥ ఆగస్టు నెల 28 వ తేది శుక్రవారం [నె 34 రు.



స్వతంత్ర ఫ్రెంచి జలాంతర్గామి జర్మనీ చేరువ సముద్రాలలోనే 4,000 టన్నుల జర్మను నౌకనుముంచి, శత్రు ఫిరంగులు వెప్తు వాక్షించే దెబ్బతిని, నీట మునుగలేక, నీటిపై అగుపడునునే ప్రయాణంచేసి, శత్రువుల దృష్టిని తప్పించుకొని స్వస్థానం చేరెను. అందరి 48 మంది నావికులు సురక్షితంగా చేరేక, సంతోషంతో దాని టపరుపై "వి" గుర్తు నావికుని హాస్యపటము చిత్రించుచున్నారు.

## యుద్ధ సమీక్ష.

ఇండియాను గూర్చి సర్ ఎస్. క్రిప్సుగారు.

న్యూయార్కు టైమ్సు పత్రికకు ఒక వ్యాసం వ్రాసి సర్ స్టాఫర్డు క్రిప్సుగారు మరొకసారి కాంగ్రెసు పార్టీవారి కోర్కెపై బ్రిటిషు ప్రభుత్వంవారి వైఖరిని స్పష్ట పరచిరి. వారిట్లు వ్రాసిరి:—

"బ్రిటిషువారు ఇండియానుంచి లేచిపోవడం అంటే ఇండియాలో ఎటువంటి పరిపాలనా విధానం లేకుండా విడచిపెట్టి పోవడం అన్నమాట. సహజంగా అరాచకం కోరేవారే అట్లా కోరతారు; జపాను దండయాత్రకు అది మంచి ఆకర్షణగా నుండును."

అట్లాచేస్తే యూరోపియను, అమెరికను చీనా సైనికులందరికిని, సివిలు ప్రజలకును ప్రాణహాని కలిగి, సంయుక్త రాజ్యాల సమిష్టి కృషికి భంగం కలుగునని వారు తెలిపిరి. "భారతీయ ప్రజల స్వపరిపాలన వాంఛయడల నేను పూర్తిగ సానుభూతి చెల్పుచున్నాను, కాని వారు జపానువారిని అక్ష రాజ్యాధికారులను ఇండియాలోకి రానిచ్చుటవలన అటువంటి స్వరాజ్యమును బడయజాలరు. సంయుక్త రాజ్యాలు ముందుగ యుద్ధంలో గెలవాలి; భారతీయ ప్రజలలో అధిక సంఖ్యాకులు యీ అవసరం గుర్తించియుందురని నే నమ్ముచున్నాను" అని క్రిప్సుగారనిరి. గాంధిగారి శాసనోల్లంఘనము శత్రువుకి సంతృప్తికరంగానుండి ప్రోత్సాహించగలదు. ఇటువంటి సత్యాగ్రహం చేస్తానని బెదరించి, అనుసరణీయం కానటువంటి విధానం అంగీకరించవలసినదిగా ప్రభుత్వాన్ని కోరవలెనని కాంగ్రెసు పార్టీని ప్రోత్సాహించిరి. అదేనా ఎప్పుడు? సంయుక్త రాజ్యాలు స్వాతంత్ర్య సమరం సాగించుచున్న యీ క్లిష్ట పరిస్థితులయందు. యుద్ధం ముగియగానే భారతీయులు తమ స్వంత స్వపరిపాలనకు ఎటువంటి రాజ్యాంగ విధానం కావలిస్తే అటువంటిది అందరుకలసి యేర్పాటు చేసుకోడానికి అన్ని అవకాశాలు యివ్వబడును, కాని అంతవరకు యీ సందిగ్ధావస్తలో ప్రస్తుత రాజ్యాంగ విధానమే కొనసాగవలెను. అని క్రిప్సుగారు తెలిపిరి.

* * *

స్వపరిపాలనకు 2 ప్రతిబంధకాలు.

బ్రిటిషు ఇండియాకు నేడే స్వపరిపాలనము యిచ్చుటకు రెండు ప్రతిబంధకాలు కలవు :—

1. యుద్ధము.
2. సాంఘిక వైషమ్యాలు.

ప్రపంచ యుద్ధంలో రక్షణకు తిరుగు దాడికి ఉపయుక్తమగు యుద్ధరంగంలో ఇండియా ఒక భాగం. అన్ని దేశాలుకలసి యీ పని సాధించాలి. ఈ సహకారానికి రెండు ముఖ్యాంగాలు బ్రిటిషు యుద్ధ మంత్రివర్గము, లండనులోనున్న పశిఫికు యుద్ధ సంఘము. ఈ రెండింటియందు సంయుక్త రాజ్యాలతో సమాన హోదాతో ఇండియాకు ప్రాతినిధ్యం ఒసంగబడినది. బ్రిటిషు సైన్యంలో అత్యుత్తమమైనది నేడు ఇండియాలో నుంచబడింది. ఈ సైన్యంపై తుది అధికారం, సప్లయి బాధ్యత, రవాణాయేర్పాటులు అన్ని బ్రిటిషువారి స్వాధీనంలో నుండక తప్పదు. పైగా భారతీయ సైన్యంలో ఎక్కువ భాగం యింకా బ్రిటిషు ఆఫీసరుల నాయకత్వం క్రిందనేయున్నది. ఆ పైని ఇండియా సంస్థానముల సేనలు, గూర్ఖా సేనలు కలవు. కావున ఇండియాలో ఆయుధాలుగల సైన్యం బ్రిటిషు సైనికులు భారతీయ సైనికులు గూడ ఒకే బ్రిటిషు సేనాధిపతి చేతిక్రింద నుండక తప్పదు.

* * *

దేశరక్షణ బాధ్యత.

అనగా, ఇండియాదేశ రక్షణ తుది బాధ్యత, ప్రస్తుతానికి, బ్రిటిషు ప్రభుత్వంపైనే యుండాలి. తుది బాధ్యత మాత్రమే. ప్రధాన బాధ్యత ఇండియా ప్రభుత్వంది. భారత సేనాధిపతి యీ ఇండియా ప్రభుత్వానికి జవాబుదారిగా నుంటాడు. తుది బాధ్యత బ్రిటిషు ప్రభుత్వం వారిదగుటచే ఇండియా ప్రభుత్వం అధికారం తగ్గిపోయిందనుకోరాదు. శత్రువులను పూర్తిగ ఓడించుటకు బ్రిటిషు ప్రభుత్వంతో మనస్ఫూర్తిగ తోడ్పడునంతకాలం ఇండియా ప్రభుత్వం అధికారం ఏమీ తగ్గించబడదు. ఇండియాలోను ఇండియానుండి ఇతర భాగాలలోను యుద్ధం కొనసాగించుటకు సర్వ సేనాధిపతి పద్ధతులకు భారతీయ ప్రభుత్వ సభ్యులెవ్వరు అడ్డుచెప్పరాదు.

సాంఘిక సఖ్యత లేదు.

మంత్రివర్గ పరిపాలనమనగా శాసనసభలకు మంత్రులు జవాబుదారీగా నుండుట. బాధ్యతగల మంత్రివర్గం ఏర్పరచి నిర్వహించుటకు అధిక సంఖ్యావర్గములకు అధికారముండరాదని ఆక్షేపించు అల్పసంఖ్యా సంఘము లుండునంతకాలం, ఇండియాలో పరిపాలనా బాధ్యత మంత్రులకు ఒప్పగించ వీలులేదు. అటువంటి బాధ్యతలుగల ప్రభుత్వం లేనపుడు సభాయుతుడగు గవర్నరు-జనరలు తన సభలో అధికసంఖ్య వారి స్వాధీనంలోనుండు ప్రత్యేపాలకవర్గంగా పనిచేయ జాలడు. కావున, క్రొత్త రాజ్యాంగ విధానం నిర్ణయింపబడువరకు, తుది బాధ్యత బ్రిటిషు రాజుగారియందే, అనగా నిజానికి బ్రిటిషు పార్లమెంటునందే యుండకతప్పదు. పార్లమెంటుయొక్క తుదిబాధ్యతను నిర్వహించుటకు, పార్లమెంటు ఉద్దేశాలు నెరవేరుటకు ఇండియాలో ప్రతిబంధకాలుంటే తొలగించుటకును గవర్నరు-జనరలుగారికి కొన్ని ప్రత్యేకాధికారములును, ఇండియా మంత్రి తణికీ అధికారమును ఒసంగబడెను. ఈ అధికారాలు బహుశ ఎన్నడూ ఉపయోగించవలసిన అవసరమే ఉండక పోవచ్చును. అయినా, క్రొత్త రాజ్యాంగవిధానం నిర్ణయించబడువరకు యీ అధికారాలు తీసివేయ వీలులేదు.

మధ్యకాలంలో అధికారం మార్పు.

ఈ మధ్యకాలంలో పరిపాలనాధికారం మార్చుకోడానికి, వివిధ సంఘాల మధ్య తగవులేకుండా పరిపాలించుకోడానికి, ఉత్తరోత్తరి యా స్థిరమైన పరిపాలనావిధానం నిర్ణయించుకోవడం ఆలశ్యంకాకుండా వుండడానికి, భారతీయ

## యుద్ధ సంచిక.

ప్రత్యేక ప్రచురణ.

వచ్చే వారం, మూడోయేటి యుద్ధ ప్రారంభమగుటచే యుద్ధ సంచిక ప్రత్యేకానుబంధం ప్రచురింపదలచితిమి. ఆ ప్రచురణయందు మామూలు పుటలకన్న ఎక్కువ పుటలు, ప్రత్యేక వ్యాసాలు, పటములు ఉండును.

రాజకీయ నాయకులంతా ఏకీభవిస్తే అట్లాచేయుటకు బ్రిటిషు ప్రభుత్వంవారికి ఎటువంటి ఆక్షేపణ లేదు. కాని యీ పనైనా కొద్దికాలంలో జరుగదు. భారతీయ ప్రధాన రాజకీయవేత్తలు, ఉద్యోగులు, సిపాయిలు అందరు కలసి కొన్ని నెలలు ఆలోచించవలసి యుంటుంది. యుద్ధం జరుగుచుండగ యీపని నెరవేరదు. ఇపుడు ఇండియా రక్షణ కొరకై సైన్యంలోచేరి ప్రాణాలకు తెగించి పోరాడుచున్నవారికి నూతన భారత రాజ్యాంగ నిర్మాణమునందు భాగంలేకుండా చేయరాదు. ఆపైన దేశీయ సంస్థానాలున్నాయి. ఆ సంస్థానలలో, యుద్ధసమయమున రాజ్యాంగవిధానం అభివృద్ధికరంగా మార్పుచేసుకోలేకపోయినందున వాటిని భారతీయ స్వపరిపాలనావిధానంనుండి వేరుచేయరాదు.

భారతీయ సమస్య పరిష్కరింప కుతూహలపడుచున్నవారికి యిటువంటి ప్రతిబంధకాలు ఎదుర్కొంటున్నాయి. వైస్రాయి సంఘ వ్యవహారముల విషయమున కొన్ని ఆచార నియమములను నిర్ణయింపరాదా యని కొందరందురు శాసన సభలకు జవాబుదారీ బాధ్యతలేని ప్రభుత్వమును బ్రిటిషు మంత్రివర్గంతో పోల్చి లాభంలేదు. కాని ఒకే ఒక జాతీయాదర్శం సాధించుటకు అన్ని రాజకీయ పక్షములవారు కలసి పరిపాలనా బాధ్యత వహించునట్టి జాతీయ ప్రభుత్వమునకును బ్రిటిషు ప్రభుత్వమునకును సామ్యంగలదు. అటువంటి జాతీయ ప్రభుత్వమునందు యుద్ధంలో జయించాలను ఒకే ఆదర్శం ప్రధానంగా పెట్టుకుంటే, ఆర్థిక సాంఘిక విధానములందు భిన్నాభిప్రాయములుండుటకు అవకాశంలేదు. బ్రిటిషు యుద్ధ మంత్రివర్గంలోవలెనే ఇండియాలో యీ జాతీయ ప్రభుత్వమునందుగూడ ప్రధాన కార్యనిర్వాహణ బాధ్యత సభ్యులందరిపై సమిష్టిగా నుండును. కొన్ని ప్రధాన యుద్ధవ్యూహ వ్యవహారములు, రాజనీతికి సంబంధించిన విషయములందు యుద్ధ మంత్రివర్గానికి తెలియరాని రహస్యాలుకూడా వుంటాయి. ఏ వ్యవహారాలు అందరి సమిష్టి బాధ్యతపై జరగాలి. ఏవి కొందరివల్లనే జరగాలన్న విషయం వారిలో వారు నిర్ణయించుకుంటారే గాని, వాటినిగూర్చి ఆచారసూత్రములు ఏ గవర్నరు-జనరలో నిర్ణయించ వీలులేదు.

యుద్ధానంతరంవరకు తాత్కాలికంగా నేర్పడే బ్రిటిషు ఇండియాలోని జాతీయ ప్రభుత్వమునకు అధికారం క్రమేణ హెచ్చుటకు అవకాశముందని, ముఖ్య రాజకీయపార్టీ లన్నియు అట్టి ప్రభుత్వం ఏర్పరచుటకు అంగీకరించుటే కష్టంగా నుందనియు, బ్రిటిషు ప్రభుత్వంవారి అభిప్రాయమయినట్లు పై వాదంవలన తెలియగలదు. బ్రిటిషు ప్రభుత్వంవారి సూచనలే అంగీకరించబడి భారత రాజకీయపక్షము లన్నింటి నాయకులు అన్యోన్య సహకారంతో పనిచేస్తే చేకూరేదేమిటో సంగ్రహంగా యిట్లు తెలుపవచ్చును. బ్రిటిషు ఇండియాలో అన్ని ముఖ్య తరగతుల ప్రాతినిధ్యంగల జాతీయ ప్రభుత్వం ఏర్పడును. ఆ ప్రభుత్వానికి ఇండియా దేశరక్షణ ప్రధాన బాధ్యత యుండును. యుద్ధవ్యూహ వ్యవహార నిర్వహణ పూచీమాత్రం యుద్ధమంత్రి వర్గము, మిత్రమండలి పాలకుల చేతిలోనుండును. ఈ జాతీయ ప్రభుత్వం ప్రస్తుత రాజ్యాంగవిధాన నియమావళి ననుసరించి వ్యవహరించును. ఇండియా మంత్రికి గవర్నరు-జనరలుకి ఉన్న అధికారాలు, బహుశ ఎన్నడు వినియోగింప అవసరం లేనటువంటి రిజర్వు అధికారాలుగ నుండగలవు.

భావి రాజ్యాంగవిధానం నిర్ణయింపబడుటకు, యుద్ధానంతరం యీ విషయమున ఆలశ్య ముండకుండుటకు తగిన ఏకీభావం కుదుర్చుటకు యీ జాతీయ ప్రభుత్వం పాటుబడును. భారతదేశ భావిస్థితి భారతీయుల చేతిలోనే యుండును.

* * *

బ్రెజిలు యుద్ధ ప్రకటన

దక్షిణ అమెరికాలోనున్న బ్రెజిలు ప్రభుత్వం సంయుక్త రాజ్యాల తరపున అక్షరాజ్యాలపై యుద్ధం ప్రకటించింది. ఇది విజయాన్ని మరింత చేరువజేయుకార్యంగా ఎంచబడుచున్నది. అమెరికా మంత్రి కార్డెలు హల్లుగారు, బ్రిటిషు, కనడా ప్రభుత్వములవారును సంతసము వెలిబుచ్చి బ్రెజిలు ప్రభుత్వమును అభినందించిరి.

బ్రెజిలు నౌకలను అక్షరాజ్యాలవారు యిటీవల ముంచివేయుటచే యీరీతి యుద్ధం ప్రకటించబడెను. "బ్రెజిలు సర్వదా శాంతినే కోరుచుండును. కాని యిపుడు తటస్థంగానుంటే శాంతికి తోడ్పడుట కానేరదను నమ్మికతో జర్మనీ ఇటలీలపై యుద్ధంలోకి దిగింది. తమదేశం చేరువనే తమ వర్తక నౌకలను అకారణంగా ముంచివేయుటచే, యీ దుష్టశక్తులను అణచివేసి ప్రపంచంలో న్యాయం స్థాపించుటకు బ్రెజిలు యుద్ధంలో

చేరింది.” అని, లండనులోని బ్రేజిలు ప్రభుత్వ ప్రతినిధి జబ్బుతో మంచంమీదనుండియే బ్రిటిషు వారికి రేడియోద్వారా సందేశం దెలిపెను.

బ్రేజిలు దేశంయొక్క నైసర్గికస్థితి యుద్ధ వ్యూహానికి ఎంతో తోడ్పడును. అందలి విమానాశ్రయాలు, హార్బరులు మిత్రమండలి కాన్వాయిలకు మంచి ఉనికి మకాములుగ నుండగలవు. ఆఫ్రికా మధ్యప్రాచ్యదేశములకుపోవు సరకు నౌకలకు విశ్రాంతిస్థానములుగ నుండగలవు. విమానాలు బ్రేజిలునుండి పడమటి ఆఫ్రికాకు ఒకే దాటున కొద్దిరోజులలో ఎగురగలవు. అమెరికా విమానాలు యికముందు అతి వడిగా ఆఫ్రికా చేరగలవు.

**రష్యా—కాకేషియా చమురు గనులు.**

రష్యాలో స్థితి చాల అపాయకరంగా నుండ నడానికి సందేహంలేదు. కాని దూరపాలోచనను యిది మరుగుపరుచరాదు. దక్షిణమునందు యిపుడు జర్మనీ కొంచెం గెలిచినందున 1943 లో జరుగనున్న పెద్ద యుద్ధాలకు రష్యా సేనలు చాలకపోవు. దక్షిణ రంగమున జర్మనుల జోరు, రష్యా యుద్ధం మొత్తంపై ఏమి నష్టం కలిగించగలదనే యిపుడు యోచించాలి. ముందు కాకేషియా, తరువాత స్టాలినుగ్రాడు, ఆస్ట్రిఖానులపై జర్మనీ కన్ను వేసింది. వారు అవి అన్నో కొన్నో తీసుకొని, కాకేషియా చమురుగనులకు మార్గం చెడగొట్టుతారనే అనుకుందాం. కాని మొదట జర్మనులు తలపెట్టిన కార్యం అదికాదే. వారెనెజువద్ద రష్యను సేనలను తెగగొట్టి, మాస్కో నగరాన్ని దక్షిణం నుండి ముట్టడిచేసి యీ వేసంగిలోనే రష్యా యుద్ధం ముగింపదలచిరి. కాని యింతవరకు ఆ పని సాగలేదు.

కాకేషియా చమురు రష్యాకు లేకుండాచేసి వచ్చే యేడు రష్యనులు కేవలం ఆత్మరక్షణ కార్యంలోనే యుండునట్లు చేయాలని జర్మనుల ఉద్దేశం. కాని రష్యనులు సీతకాలంలోను, వసంతకాలంలోను, వేసంగిలో కొంతకాలమున్ను ఉత్తరదేశమునన్నున్న చమురు సరఫరా ఎక్కువ చేసుకొనిరి. అది 1943 యుద్ధానికి పూర్తిగ సరిపోవచ్చును, ఈ మాటే నిజమగుచో, కాకేషియాలో స్థలాలను జర్మనులు వశపరచుకొన్నంత మాత్రాన చాలదు. రష్యా సేన యింకనెంతో మిగిలియున్నది. పడమరను జర్మను సేనలను వారు కొట్టగలరు.

**టిమొషెంకో సేనాని యుక్తి.**

సోవియటు రష్యా వీరుడగు మార్షలు టిమొషంకో తన సేనల యాథాస్థితిని క్షీణించకుండా నుంచగల్గెను. ఇంతవరకు ఆతడు జర్మను లనుకొన్నట్లుచేయ వీలులేకుండా చేసెను. 1812 లో నెపోలియనుతో వలెనే యిపుడుగూడ రష్యా యుద్ధంలో రష్యనుల యుక్తి, శత్రు సేనలను ఎదిరించుచు, వెనుకకు తగ్గుచు, తమ సేనకు అట్టే నష్టంలేకుండా యుంచుకొనుటే. అందుచే జర్మనుల విజయానికి అవసరమగు పని—రష్యను సేన విచ్ఛిత్తగుట—జరుగలేదు. 1812 లో నెపోలియను త్వరగ ఓడిపోయెను. కాని ఇపుడు జర్మనీ సంపద సైన్యం అంతకన్న అధికంగా నుండుటచే, ఓడుట ఆలశ్యమగును.

యూరోపులోని సంపద శక్తి అంతాకూడ దీసి, రష్యాపైబడి త్వరలో నోడించి, మరల పడమరవైపు తిరిగి, బ్రిటను-అమెరికాలకు యిక యుద్ధం సాగించి ప్రయోజనంలేదని జర్మనీ చెప్ప దలచెను. యూరోపులో తమ అధికారం యీ రీతిగ స్థిరం చేసుకోవాలని నాజీలు ప్రయత్నించిరి. తరువాత బ్రిటను ఇంగ్లాండులను శాంతంగానే పీకనులిపేయాలని జూచిరి. కాని రష్యా వెలుగుబంటి వారి ఆటలను సాగనీయలేదు. చర్చిలు-స్టాలినుల సంప్రదింపులవలన జర్మనీకి యింకో చెంపపెట్టు తగలగలదు. ప్రస్తుత రష్యా యుద్ధ పరిస్థితులు, రష్యాకు సప్లయిలు, రెండో యుద్ధరంగములగూర్చి చర్చిలు-స్టాలినులు మాట్లాడియుందురు. దీనివలన ఇంగ్లాండు-రష్యాల సంధి మాటలలోనే గాక చేతలలోగూడ దృఢపడును. అదివరకు అడిగితేనే సహాయం చేసే మిత్రదేశాలు యిపుడు రష్యాకు తమ స్వంత కార్యంగానెంచి సహాయం చేస్తాయి. ఇక రష్యా-బ్రిటను-అమెరికాలు కలసి యుద్ధ వ్యూహాలు పన్నుతాయి. ఈ సమిష్టి ప్లానువలన విజయం చేరువకాగలదు. ఇందుకు నల్గురు పెద్దలు బాధ్యులు—చర్చిలు, స్టాలిను, రూజువెల్టు, చియంగ్‌కాయిషేకు.

**డీపీ—అంకురార్పణం.**

మాస్కో సభలో చర్చిలు స్టాలినులు రెండో యుద్ధరంగంగూర్చి చర్చించియుందురని పైన చెప్పియుంటిమి. ఫ్రాంసులోనున్న

డీపీ రేవులపై దాడి యీ రెండో రంగమునకు అంకురార్పణంవంటిది. ముమ్ముందు జరుగు పెద్ద దాడులకు యిది సూచన. ఫ్రాంసుపై యుద్ధానికి, రెండోరంగం ఏర్పరుచుటకు అవసర మగునంత పెద్ద సేన ఒకేరాత్రిలో దింపుట కష్టం. కనుకనే డీపీలో పగలే సైన్యాలు దింపేరు. దాడి 9 గంటలే జరుప నిశ్చయించినందున ఒక రాత్రిలో ముగించవచ్చు. అయినా పగలే జరిపారు. పైగా బరువైన టాంకులుగూడ శత్రు దేశంలోదింపి దాడిచేసేరు. తాత్కాలిక దాడు లందు టాంకు లుపయోగించుటకు యిదే మొదటి సారి.

డీపీ బ్రిటిషుతీరానికి 60 మైళ్ల దూరంలో నుంది. దానిలో బ్రిటిషు సైన్యాలు దింపినపుడు, పైన జరిగిన విమానయుద్ధంలో బ్రిటిషువారివి 98, జర్మనీవారికి 91 విమానాలు కూలిపోయి నాయి. జర్మనీవి మరో 192 చెడ్డాయి. పడమటి యూరోపులో జర్మనుల విమానబలం 500 మాత్రమే అందు నూటికి 20 వంతు నాశన మయి, యింకో 35 లేక 40 వంతు చెడగొట్ట బడింది. స్వరక్షణ చర్యలందుకన్న, దాడిచర్య లందు నష్టం ఎక్కువుంటుంది. పైగా జర్మను రక్షణసేనలు ఇంగ్లాండుకి చేరువ తీరాలందు, యితరచోట్లకన్న ఎక్కువుంటాయి. కావున డీపీ రేవుపై దాడి చాల ప్రశంసార్హమయినది. ఈ దాడియందు అమెరికా విమానాలు, ఫ్రెంచి విమానాలుకూడా మొదటిసారి పాల్గొన్నాయి. ఇందు అంతర్జాతీయ ప్రాతినిధ్యం గలదు.

---

# సైన్యాన్ని అనుసరించువారి సేవ.

## వంటవాడు ఫిరంగులకు గుండ్లు అందించుట.

భారతీయ సైన్యంలో కాల్బలమునందు తుపాకులు ఫిరంగులు ప్రేల్చు సైనికులెంత అవసరమో వారి వెంటనుండు సేవాదళముగూడ అంత అవసరమే. వారికి బిరుదులుండవు, వీరులుగ గణింపబడరు, వారిని గూర్చి తలపోయువారే యుండరు. కాని కొండలమధ్యను, ఎడారుల లోను తుపాకులు మోయుచు, ఫిరంగులు ప్రేల్చుచు సాగిపోవుచు శత్రు శ్రేణిని చేదించు సైనికులు చేయునంత సేవ వీరును చేయుచుందురు.

వారిని కాంపుఫాలోయర్సు అంటారు. సైనికులను ఎల్లప్పుడు తయారులో నుంచుటకు సర్వదా చేయవలసియుండు సవాలక్ష సామాన్యపు చాకిరీ వీరు చేస్తూవుంటారు. తమ కార్యనిర్వహణయందు యీ సేవకసైన్యంకూడా చాల ప్రమాదాలకు లోనయి, నేర్పుతో పనిచేయుచు సైనికుల మనోధైర్యం కాపాడుటకు ఎంతో కృషి చేయుచుండును.

జాడ్యాలు తెచ్చిపెట్టు యీగలకు తావిచ్చు మురికి, శిబిరాలలో నుండకుండ కాపాడు ఊడ్చు సేవకుడు, నీళ్ల చాలకున్నా బట్టలు శుభ్రంగా ఉతుకుచుండు చాకలి, యుద్ధంలో చెడిపోయిన దుస్తులను సత్వరంగా మరమ్మత్తుచేసి యిచ్చుచుండు దర్జీ (కుట్టు పనివాడు) - వీరందరు గూడ అనేక కష్టాలకోర్చి సైన్యం వెంటనుండి పని చేయుచుందురు. సైన్యం మంచి స్థితిలో ఉందంటే ఆ కీర్తి వీరికిగూడ చాలభాగం దక్కుతుంది, ఆఫ్రికా ఎడారి సైన్యమునందు సేనాధిపతులు వీరందరి సేవను మిగుల కొనియాడిరి. ఆధునిక యుద్ధపరిస్థితులయందు సాధారణంగా సులభంగా శాంతంగా జరిగే కుట్టుపని చాకలిపని మంగలిపనిగూడ చాల ప్రమాదాలకులోనయి చేయవలసినవేయని సేనాధిపతులెరింగియుంట చేతనే, యీ సేవకుల పని మెచ్చుకొనిరి.

సైన్యం వెంటనుండే సేవకులకు వారి స్వంత నియమాలు కొన్నిగలవు. పోరు సలుపుచుండు సైనికులను, ఎన్నడు విడువరాదని వారిదీక్ష. సైనికులయెడ వారెంత భక్తిలో మెలగెదరో రెండు అంశాలబట్టి తెలియగలదు.

ఒక యుద్ధంలో రెండు రోజులవరకు ఒక వంటవాడు తన సైనికదళం శత్రుదాడులను ఒకదాని తరువాత నొకటి ఎదుర్కొనుటను గాంచెను. వారికి తిండి తినుటకుగూడ వ్యవధి లేకుండెను. వంటవాడు నెమ్మదిగ తనవంట ప్రతిపూట చేయుచు, తానే గుండ్లు ప్రేలుచున్న యుద్ధరంగంలోనికి చాటుగ తప్పించుకొనుచు పోయి సైనికులకు తిండిపెట్టి వచ్చెను.

వేరొక వంటవాడు యింకా యెక్కువ పని చేసెను. అతడు నీరు, వంటసామానులు తీసుక పోవడం ఒక్కనాడూ మానలేదు. కాని ఒక నాడాతడు ఫిరంగులు కూడ ఆకలితోనున్నట్లు గుర్తించెను. అందుచే మరఫిరంగులు, తుపాకులు ప్రేలుచుండగ యుద్ధరంగంనుండి తప్పించుకొని వెనుకకుపోయి బుజాలందు తోటాలు ఫిరంగిగుండ్లు మోయుచున్న పలువురు మిత్రులతోగూడ తిరిగి రంగంలోకివచ్చి, సైనికులకు సరకందజేసెను.

---

# “జపానువారి సంగతి నేను గ్రహించాను.”

II

## రహశ్య పోలీసులు - ఆర్థిక యుద్ధం—ఆక్రమిత దేశాలలో అత్యాచారాలు.

జపానులోను, వారాక్రమించిన దేశాలలోను, యీ యుద్ధానికి పూర్వం, యుద్ధం ప్రారంభమయిన తరువాత కూడా నివసించి, అనుభవించి, వారు చెప్పే శ్రీరంగనీతులకూ వారు చేసే పనులకు ఎంత వ్యత్యాసం ఉందో స్వయంగా తెలుసుకొన్న ఒక ప్రముఖుడు “యుద్ధ సంచికకు” ప్రత్యేకంగా వ్రాసిన వ్యాసంలో రెండోది యీ దిగువ గలదు :

జపాను రహశ్యపు సర్వీసు దళము బహుశః ప్రపంచంలోకల్ల ప్రశస్తమయినది. అంతమూటనడం నమ్మదగ్గదిగా కనబడదు. కాని, కాదనగలచినవా రుండరు. నేను దూరప్రాచ్యదేశాలన్నింటియందు స్వయంగా చూచేను. పని క్షుణ్ణంగా చేయడానికి, అవినీతికి, అద్భుతమయిన తెలివితేటలకి, నీచపు కుట్రలకి జర్మను గూఢచారి ముఠా గెస్టాపోకు ఏమాత్రం తీసిపోదు.

దేశంలో రహశ్యపు పోలీసు దళమును, విదేశములందుండి సైనిక సమాచారాలు తెచ్చు 5వ పంక్తివారిని, కుట్రలుపన్ని పరిశ్రమల పడగొట్టువారిని స్వాధీనమునందుంచుకొని పనిచేయు యీ రహశ్యపు సర్వీసు, అంతర్జాతీయ మర్యాదలు న్యాయ నియమములు ఉల్లంఘించుటయందే శక్తికలిగియున్నది. జపాను ప్రజలకు “ప్రైవేటు” అను శబ్దం తెలియదు. విదేశాలందున్న ప్రతి జపాను దేశీయుడు జపాను గవర్నమెంటు ఏజెంటే. దక్షిణ సముద్రాలలో దుకాణదారులుగానున్న జపానువాడు స్వదేశానికి పోతాడు, తిరిగి తన దుకాణానికి వస్తాడు; మళ్లాపోతాడు, మళ్లా వస్తాడు; చివరకు గత సాలాంతమున వాడే ఇంటికిపోయి యుద్ధ నౌకపై నావికుడుగా ఆ ప్రాంతాలకు వచ్చేడంటే వానినిగూర్చి ఏమనుకోవాలి. ఆరేళ్ల క్రిందట టోకియో నగరంలో నేను టెన్నిసు ఆడుతూవుంటే ఒక నౌకాదళ సైనికోద్యోగి లెఫ్టనెంటు నాకు పరిచితుడయ్యెను. తరువాత ఆ నగరంలో అతన్ని ఒకటి రెండుసార్లు చూచితిని. నేను మనుష్యులిని మరిచిపోను. బాగా గుర్తుపట్టగలను. చిట్టచివర కాతన్ని హాంగుకాంగ్ నగరంలో కప్పులు సాసర్లమ్మే దుకాణంలో నౌఖరుగ చూచేను. నేను పోలీసు వారికి వెంటనే రిపోర్టు చేసెను. కాని వారేమి చర్య తీసుకోలేకపోయిరి. అతను నౌకాదళం విడచినట్లు సర్టిఫికేట్లు అతనివద్ద నున్నాయి.

### “కోతి మనుష్యులు.”

చిత్రమేమంటే జపాను రహశ్య పోలీసు దళం చీనాలోనే జయప్రదంగా పని చేయలేకపోయింది. ఏమంటే “ద్వీపంలోని కోతిమూక” యొక్క మనోతత్వం చీనావారికి బాగా తెలుసు. జపానువారు మాత్రం చీనావారిని పూర్తిగ ఎప్పుడు తెలుసుకోలేకపోయిరి. చీనా చక్రవర్తి భార్యయే జపానువారికి “ద్వీపంలోని కోతిప్రజ” అని పేరు పెట్టింది.

జపాను వెర్రికుక్క చేష్టలతో ప్రారంభించిన యీ యుద్ధమునందు ప్రారంభపు రెండు విజయాలు పొందుటలో యీ జపాను రహశ్యపు సర్వీసే వారి ప్రభుత్వానికి యెక్కువగ తోడ్పడింది. 1940 వ సం॥లో ఫ్రెంచి ఇండో చీనా జపానుకి లొంగిపోవుటకును, 1941 వ సం॥ డిశంబరు 7 వ తేదిన ఐదు గంటల “యుద్ధం”తో తాయి

లాండు లొంగిపోవుటకు, యీ గూఢచారులకే జపాను ప్రభుత్వం కృతజ్ఞత తెలుపవలసియున్నది. "ప్రాచ్యదేశములందు నూతన వ్యవస్థ," "తూర్పు ఏషియాలో సమానాభివృద్ధి" యను ఆదర్శవాక్యములు ఘోషించుచు, చీనాలో ఆర్ధికయుద్ధం ప్రారంభించి దాని చెడుగు యితర దేశాలకు గూడా ప్రాకుతుందనే విషయం దాచియుంచి, తూర్పు దేశాలవారి కళ్లుగప్పింది యీ గూఢచారుల దళమే. "ఆర్ధిక యుద్ధము" "సమానాభివృద్ధి" అను యీ రెండు పదములకు జపానువారి మనసులో భేదంలేదు. ఆర్ధికంగాను యితర విధములను రెండో వానిపై యుద్ధంచేసి, అభివృద్ధి అంతా తానే పొందాలన్న పద్ధతి ఒక్కటే వారికి తెలుసు.

జపానువారు చెప్పే "సమానాభివృద్ధి" ఏమిటో నేచూచేను. నా పూర్వీకులు ఇండియానుండి వచ్చేరు, కనుక ఇండియా అంటే నాకు ప్రేమ. ఇండియాను "యీ ఆర్ధికాభివృద్ధి విధానం" నుండి దైవం తప్పించుగాక. ఉదాహరణకు: 1937 వ సం॥లో షాంగే నగర పరిసరములు జపాను

## విష బాణాలు.

Poisoned Arrows

వదంతులున్నాయి జాగ్రత్త!
అవి
మీ మనస్సును మభ్యపరచి
మీ బుద్ధి చెడగొట్టి
మీచే తెలివితక్కువ పనులు చేయించుటకు
శత్రువు పంపే విష బాణాలు.

✽ వదంతులు నమ్మకండి. ✽



జపాను వారిని ఎదుర్కొనుటకై దేశీయ యుద్ధ రంగం తయారుచేయుడు.

వారు తీసుకున్నపుడు, అందలి మిల్లులు, యంత్రాలు, ప్రైవేటు కంపెనీలు అన్ని పూర్తిగ తీసుకున్నారు. చీనావారివి కాని, చీనావారితో కలసి విదేశీయులు భాగస్వాములుగ నున్న వ్యవస్థలు గాని, లక్ష్యంచేయక అన్ని తీసుకున్నారు. కారణం: అవి జపాను స్వాధీనంలో నుండుట. జపాను సైన్యానికి అవసరం కనుక. బ్రిటిషువారు అమెరికనులు తమ హక్కులకు భంగం కలుగుచున్నదని టోకియో నగరంలో మొర్రపెడితే ఖరీదులో 1/20 వంతు వారికొసంగి, ఆ ఆస్తులను ప్రభుత్వంవారు భుక్తపరచుకొనిరి.

ఇక ఫ్యాక్టరీలలో మిల్లులలో పనులు చేయుటకు వేలకొలది చీనావారిని అరెస్టుచేసి వాళ్ల చేత బలవంతంగ పని చేయించుకుంటున్నారు. అదివరకు వాడు కంపెనీ మేనేజరు కాని, లాయరు కానీ, ప్రఫెసరుగాని, డాక్టరుకానీ, జపాను ఆక్రమించిన దేశంలో ఉండిపోయి యున్నచో కూలి పని చేయవలసిందే. అట్లా పనిచేయించి, సరకు చవకగ తయారుచేయించి "చీనాలో తయారు" అను ముద్రవేసి, చీనాలో అదివరకు తయారగుచుండిన సరకుకన్నను, జపానునుండి దిగుమతి యగు సరకుకన్నను చవకగ విక్రయించి, చీనా దేశీయ పరిశ్రమలను పడగొట్టుచున్నారు. ఈలోగా జపానునుండి అనేకమంది ఆశబోతులు అసమర్థులు ఆక్రమిత చీనాదేశం చేరి, తమ ప్రభుత్వంవారి ప్రోత్సాహతంతో వచ్చి, అన్ని పనులుతీసు కొనుచుండిరి. అనుభవం లేనివారంతా పరిపాలకోద్యోగులు. ఆఖరు కనికిష్టపు పని తప్ప యింకే పని చీనావారి కివ్వరు.

ఐదేండ్ల క్రిందట చీనా జాతీయ నాణెమగు డాలరు, హాంగుకాంగు నగరంలోని డాలరు కన్న ఎక్కువ విలువ కలిగియుండేది. 1940 వ సం॥లో హాంగుకాంగులో ఒక నెలకు సరిపోయే డబ్బు షాంగేలో రెండు నెలలకు సరిపోయేది.

చీనా నాణెం విలువ పడిపోయింది. అమెరికా డాలరులు 80, చీనా డాలరులు 300 తో సమ మయనాయి. జపాను ప్రభుత్వంవారే యిట్లు చీనా నాణెం విలువ పడగొట్టి ప్రజలకు నష్ట పెట్టిరి. ఇదే యింకో ప్రైవేటు కంపెనీయో వ్యక్తో చేసియున్నచో కఠిన శిక్ష వేసియుందురు.

జపానువారి క్రూరత్వం.

జపాను పరిపాలనయొక్క క్రౌర్యం, నీచ త్వం, ముఖ్యంగా ఫార్మోసాదీవిలో కనబడు తుంది. చీనాకన్న ముందే యీదేశంలో జపా నువారు యీపనులు నేర్చుకున్నారు. 1895 వ సం॥లో ఫార్మోసాను ఆక్రమించినపుడు జపాను ప్రచారవాక్యాలు బూటకపు ఆదర్శవాక్యాలు వేరు. సమానాభివృద్ధి అవకాశాలిస్తామని అపుడన్నారు. "మిమ్ము నాగరికులను చేస్తాం, మీచిన్నదీవిని అం దమయిన మంచి సిరిసంపదగల దేశంగా మార్చే స్తాం" అని అపుడు చెప్పేవారు. గత మహా సంగ్రామానికి పూర్వం జర్మను సామ్రాజ్యపాల నము అన్ని దేశాలకు అగ్గజంగానుండి నిరసింప బడుచుండెను. కాని ఆ జర్మను చర్యలు ఫార్మో సాలో జపాను చర్యలతో పోల్చినచో ఎంతోమం చివనిపించుకుంటాయి. నేడు యూరోపులో నాజీలేమి క్రూరకార్యాలు చేస్తున్నారో అవన్ని జపానువారు చేస్తున్నారు; అంతేకాక నాజీ లూ హింపలేనివెన్నో గూడా చేస్తున్నారు.

ఈ ఫార్మోసా దీవి సర్వదా నౌకాదళాధిపతు లో లేక సేనాధిపతులచేతనో పరిపాలింపబడుచుం డేది. జపానులో సైనికోద్యోగులేమన్నా ముప్పే. అందుచే వారి మలయ, హాంగుకాంగు, డచ్చి తూర్పు దీవులు, ఫిలిప్పైన్సు, బర్మాలందున్న దేశీ యుల స్థితి ఎంత అధోగతిగనుందో వేరే చెప్ప నక్కరలేదు. హాంగుకాంగులోనున్న భారతీ యులగూర్చి తామసుశెష్టను సతి గత నెలాఖ రున చెప్పినమాటలు భారతీయులు జ్ఞప్తియందుంచు కోవాలి. ఆమె అక్కడేపుట్టిన భారతీయ స్త్రీ, అన్యదేశీయుని వివాహమాడింది. ఆవిడ ప్రక టనలో అసత్యమేమిలేదు. భారతీయులను బల వంతంగా అందరిని సైన్యంలో చేర్పించుతున్నారు. ఇండియా ఇండిపెండెన్సు లీగులలో చేరకపోతే ఉన్నహక్కులు తీసేస్తామని భారతీయులను బెది రిస్తున్నారని ఆమె చెప్పెను. ఆహారపదార్థ ములు పూర్తిగా జపానుకే పోతున్నాయి. కొర గాని జపాను సైన్యం నోట్లు దేశీయులకిచ్చి వస్తు వులు తీసుకోడం, ప్రజలచే రోడ్డువేయించి వారు శుష్కించేవరకు పనిచేయించి తరువాత తుపాకి తో కాల్చి చంపడం, యివన్నీగూడ నిజమే.

జపాను బోధించుచున్న "సమానాభివృద్ధి" చివరకు అమల్లో యిట్లాగుంటుంది. ఓడిపోయిన ప్రజలందరి దుర్దశ యిట్లున్నది, ఓడిపోయిన వారేగాదు, తాయిలాండు, ఫ్రెంచి ఇండో చీనాలో ప్రజలుగూడ యిట్లే అనుభవించుచున్నారు. ఆ యుధాలు పడేసి జపానుకి సహాయం చేస్తామన్న వారిస్థితిగూడా యిట్లేవుందిగాని, మెరుగ్గా లేదు, కనుక యింక మిగిలియున్న స్వతంత్ర ఆశియా రాజ్యాల నివాసుల కర్తవ్యమేమిటి? తమ దేశా లకు జపాను దాడివచ్చినచో దాని నెదుర్కొని నిర్మూలించుటకు ప్రాణాలొడ్డుటకాక యింకేము న్నది. సహకారం చేస్తారా? అట్టివారితో ఎన్న టికి సహకారం కూడదు. ఇంకే అభిప్రాయం కలిగియున్న జాతీయ ఆత్మహత్యకు కారణ మగును.

# కాంగ్రెసు కోర్కె అంగీకరింపదగ్గది కాదు.

## నేషనలు వార్ ఫ్రంటువారి అభిప్రాయము.

ఇండియాలో ఏర్పడిన జాతీయ యుద్ధరంగం (నేషనలు వార్ ఫ్రంటు) ఉద్యమము యుద్ధసహా యకార్యములను వృద్ధిచేయుటకేగాని పార్టీ రాజ కీయాలందు పాల్గొనుటకు ఉద్దేశింపబడలేదు. కాం గ్రెసు వర్కింగు కమిటీవారు యిటీవల గావించిన తీర్మానాలు దేశరక్షణ కార్యములకు అడ్డుతగులు చుండుటచేతనే నవి గమనించబడినవి కాని, లేకుంటే వాటితో యీ ఫ్రంటుకి జోక్యం లేదు. జపానువారు దాడిచేయనున్న యీ సమయంలో కాంగ్రెసు సూచనలు దేశరక్షణకు తోడ్పడునా నిరోధించునా యని మనం ఆలోచించాలి. ఆ సూచన లంగీకరింపబడినచో, విజయం చేకూరుట సులభమని మనకు తోచినచో యిష్టం లేని ప్రభు త్వంవారిచే అవి అంగీకరింపజేయుటకు మనం

పాటుపడవలెను. కాని అవి యుద్ధయత్నానికి నిరోధంగానుండునని మనం నమ్ముచున్నచో, వాటి నెదిరించుటగూడా మన విధియే యగును.

కావున కాంగ్రెసు కోర్కె లెటువంటివో స్వయంగా ఆలోచించి చూతము గాక. ఇండియాలో యింకో ప్రభుత్వం ఏర్పడేలోపున, అది యెట్లుండాలో ముందు ప్లానేనా వేసుకోకుండా, బ్రిటిషు ఆధికారం యిపుడే పూర్తిగా యీ దేశం నుండి తొలగిపోవాలని కాంగ్రెసు కోరుచున్నది. దీని ఫలితం ఏమగును ? పండిత జవహరిలాలు గారే యిందుకు జబాబు చెప్పిరి.

> "బ్రిటిషు సేనలును, సివిలు పరిపాలనా శిబ్బంది తతంగం అంతా వెడలిపోతే ఒక 'సూన్యస్థితి ఏర్పడును అది వెంటనే పూర్తిచేయడం కష్టం"

బ్రిటిషువారు యీ దేశంనుండి వెడలిపోయినాక వెంటనే పరిపాలన సాగించుటకు కాంగ్రెసు ఏదో విధానం సిద్ధంచేసియుండునని కొందరనుకుంటారు. గాంధిగారు చెప్పినట్లు దానిగూర్చి వారికో ఉద్దేశం లేకపోలేదు. కాని అదొక విధానం, పద్ధతి అనడానికి వీలులేదు. కేవలం ఒక అభిలాష మాత్రమే.

బ్రిటిషువారు వెడలిపోతే ఏమగును.

గాంధిగారు యిట్లు దెలిపిరి :— "బ్రిటిష్‌పాలకులు వెడలిపోతే యీ దేశంలో బాధ్యతగల స్త్రీపురుషులు, అన్ని తరగతులవారి ప్రతినిధులును కలసిచేరి తాత్కాలిక ప్రభుత్వం ఏర్పరచెదరు." కాని యీ ప్రజా ప్రతినిధులను అన్ని తరగతులవారిని కూడతీయుట ఎంత కష్టమో మనమెరుంగుదుము. ఉండవలసిన ప్రభుత్వం ఎట్లుండాలో పాలకులుగ ఎవరుండాలో ఆ విషయంలోకూడా ఒకటి రెండు భేదాభిప్రాయాలుంటే, యింక అడిగేదేముంది ? ఈ విషయములందు అంత్య నిర్ణయం ఎవరిది ? తాత్కాలిక ప్రభుత్వం ఏర్పడుటకెన్నాళ్లు పట్టును ? (కాంగ్రెసు తీర్మానం చేయడానికే ఏప్రిలునుండి ఆగస్టు వరకు పట్టింది.)

సహజమగు యిట్టి ప్రశ్నలన్నింటికి కాంగ్రెసు తీర్మానంలో జవాబగుపడదు. అంతకన్న నాయకులెవ్వరు వాటికి బదులు చెప్పలేదు. పైగా గాంధిగారు యిట్లన్నారు :—

> "మా ఉద్దేశం స్వాతంత్ర్య సాధించడమే. పరిపాలనా బాధ్యత ఎవరు తీసుకున్నా తీసుకోవచ్చు. ఆ అధికారం పార్టీలకిచ్చుటకే నిశ్చయించినచో పార్టీలకెందు కివ్వాలి అని మీరు ప్రశ్నింపరాదు. కాంగ్రెసు యిదివరకెన్నడు వినని క్రొత్తవారికే అధికారం యిచ్చినా యిచ్చుకోవచ్చును."

కావున వెన్వెంటనే దేశ పరిపాలనకు ఖచితమగు ఏర్పాటేదీ కాంగ్రెసు ఆలోచించి నిర్ణయించలేదని తెలుస్తూనేయుంది. తమ గాఢమగు అభిలాషను ప్రకటించి తక్కిన విషయాల ఖర్మం ఎట్లావుంటే ఆలాగుంటుందని విడిచేరు.

ఎటువంటి నిరోధం.

తరువాత ముఖ్యమయిన విషయం దేశరక్షణ గురించి. అస్సాం, బెంగాలు అవతలుండి మన మీద దుముకుటకు జపాను సిద్ధంగానుండగ, దేశ రక్షణ కార్యములందు ఎక్కువ శ్రద్ధ వహించుట మనవిధి. ఈ ముఖ్య విషయమై సంతృప్తికరంగా వర్కింగు కమిటీవారు ఏమీ తీర్మానించలేదు.

1942 వ సం॥ జూలై 14 వ తేది వర్ధా తీర్మానంలో శత్రుదాడి నిరోధించక తప్పదనియు, "మిత్రమండలి దేశాలకు యిష్టముంటే శత్రుదాడి నిరోధించడానికి ఇండియాలో సైన్యాలను ఉంచుకోవచ్చున"నియు తీర్మానించబడెను. అట్లన్నందున ఆయుధ సహాయంతో మన దేశరక్షణ యందు మనకెట్టి బాధ్యతలేదని ఎంచవచ్చునా ?

కాని బొంబాయిలో గావింపబడిన చిట్టచివర తీర్మానమునందు, కాంగ్రెసు వర్కింగు కమిటీ చాల గొప్ప పొరబాటుచేసినట్లు గుర్తించి, అదివరకు ధోరణి బలపరచుటకుగాను, స్వతంత్ర భారతదేశము తన శక్తి సంపదనంతా యీ పోరులో దారపోయునని స్పష్టంగా తెల్పుచు యిట్లనెను :—

> "తాత్కాలికముగ అవసరానికేర్పడు జాతీయ పభుత్వం ప్రధాన కర్తవ్యము ఇండియాను రక్షించి తనకుగల ఆయుధ సైన్యాలు శాంతి సైన్యాలన్నింటి సహాయంతోను, మిత్రమండలి సహాయంతోను శత్రుదాడి నిరోధంచేయుట అయియున్నది."

వర్కింగు కమిటీవారు యిట్టి అభిప్రాయం తెలిపినప్పటికీ గాంధిగారు తమ అహింసా తత్వం విడిచినట్లు లేదు :—

> "స్వాతంత్ర్యం సంపాదించుటతో మీపని ముగియదు. మీరు యికముందుకూడా లష్కరులు గనే—అంటే అహింసా విధానమునందు—ఉండవలసియుండును" అని వారనిరి.

వర్కింగు కమిటీకి గాంధిగారికి యిట్టి భేదాభిప్రాయాల విషయమున మనం చేయవలసిందేమీ లేదు. ఒక్కటి స్పష్టమగుచున్నది. ఏషియా నంతా ఆక్రమించుకోదలచిన జపాను మనదేశాన్ని బెదిరిస్తూవుంటే, మనమాత్రుదేశ రక్షణకు దేశంలోని అతిపెద్ద రాజకీయపక్షం తన అనుచరులకు ఉపయుక్తమగు కర్తవ్యం సూచింపలేకుండా యుంది.

కాంగ్రెసు కోర్కెకు ఆధారమేది.

అయినను సంపూర్ణ స్వాతంత్ర్యం యిచ్చి, బ్రిటిషు అధికారం వెంటనే తొలగించాలని పదే పదే కోరుచున్నది. కాంగ్రెసు యిట్లు కోరడానికి మూలకారణం ఏమిటాయని తెలియగోరుట సహజము.

ఇందుకు రెండు నమ్మకాలుండవచ్చును :—(1) ఈ దేశానికి స్వాతంత్ర్యం అత్యవసరమయినదని, (2) స్వాతంత్ర్యం వచ్చినాక దేశీయులకు ఉత్సాహం యెక్కువై, శత్రుదాడిని నిరోధించగల శక్తి సామర్థ్యాలు ఊరి ఉప్పొంగుతాయని.

ఇందు మొదటి కోర్కె, దేశానికి స్వాతంత్ర్యము కావాలని వాదించడం సహజమే, ఎవ్వరు కాదనరు. కాని సత్యం తెలుసుకోవాలంటే, జపాను నిరంకుశత్వం నశిస్తేగాని ఏషియాలో ఏదేశానికేనా స్వాతంత్ర్యం ఆశించడానికి అవకాశం వుందా?

ఇంక రెండో నమ్మకంగూర్చి :—పరిపాలనా విధానంగూర్చి ఇండియా పూర్తిగ సంతృప్తి చెందియున్నచో యుద్ధ సహాయకృషి చాల వృద్ధియగుట నిజమే, కాని కాంగ్రెసు సూచనలు యితర పెద్ద పార్టీలవారికి సంతృప్తిగాలేవు.

కాంగ్రెసు సూచనలు ముస్లిములీగు వారంగీకరింపజాలరని జిన్నాగారంటున్నారు. అంతే కాక యిట్లు బెదిరిస్తున్నారు,

> "బ్రిటిషు ప్రభుత్వంవారు గాంధిగారి కోర్కె నెంతమాత్రమంగీకరింపరాదు. అది పదికోట్ల భారతీయ ముస్లిముల పవిత్ర సంకల్పమునకు విరుద్ధంగా నుండును"

కాంగ్రెసు కోర్కె హిందువులకు అంతకన్న అంగీకృతం కాదు. హిందూ మహాసభకు చెందిన సవర్కరుగారు యిట్లు ప్రకటించిరి :—

> "కాంగ్రెసు తీర్మానం హిందువుల న్యాయమగు హక్కులకు నష్టదాయకమగుటేగాక, యావద్భారత దేశైకమత్యమునకు శక్తికి వినాశకరముగనుండును."

ఇట్లుండుటచేత, స్వాతంత్ర్య భారతదేశంలో కాంగ్రెసు కోర్కెలపైనే ఆధారపడియుండు ప్రభుత్వం ఏర్పడినచో దేశరక్షణకు ఎక్కువ శ్రద్ధ కలుగునను వాదము సరికాదు.

కాంగ్రెసు కోర్కెను ఆమూలాగ్రంగా పరికిస్తే, తెలిసేదేమంటే మొదట కొంతకాలం దేశంలో ఎటువంటి ప్రభుత్వం లేకుండా పోతుంది ; (2) కోరిన స్వపరిపాలనా విధానం ఏర్పరచుటకు తగిన సాధనలు లేవు ; (3) జపాను గుమ్మంలోకివచ్చి బెదిరిస్తున్నా తరిమేసి దేశాన్ని రక్షించుకొనే యేర్పాటులు లేవు ; (4) కాంగ్రెసు కోర్కెకు ఇండియా ప్రజలలో యితర తెగలవారెవ్వరును, ఏ రాజకీయపక్షమున్ను బలపరుచుటలేదు.

---

# దూరాలోచనలేని దురాలోచన.

తన తప్పు తాను తెలిసికొంటే బ్రహ్మంతవాడన్నారు. మన ఊహలు మనకు బాగానే ఉంటాయి. కాని, మనమొకటి తలచితే భగవంతు డింకొకటి తలుస్తూ ఉంటాడు. అందుకనే ముందువెనుకలు బాగా ఆలోచించి వ్యవహరించాలి. ఒక్క ఉదాహరణ చూడండి. భారత దేశానికి స్వరాజ్యం కావాలని కాంగ్రెసు సభవారు కోరుతున్నారు. భారతదేశానికి స్వపరిపాలనాధికారం ఎప్పటికైనా ఏర్పడవలసిందే. ఆ మాటకు ఎవరూ అభ్యంతరంగాని, ఆక్షేపణగాని చెప్పరు. దేశంలో ఉన్నటువంటి అన్నిపార్టీలవారూ స్వపరిపాలనాధికారం కావలెననే కోరుతున్నారు. ప్రస్తుతం మన దేశాన్ని పరిపాలిస్తున్నటువంటి బ్రిటిష్ వారుకూడా అదేమాట అంటున్నారు. కాని, అంభంలో కుంభం ఆదివారంలో సోమవారం అన్నట్లుగా, ఒకమూల యుద్ధం ఉధృతంగా

సాగుతున్నసమయంలోనే స్వరాజ్యంకోసం మనం విరహతాపం పడుతూవుంటే మనలనుచూచి లోకం వెక్కిరిస్తోంది. మన శత్రువులు మన చెవులకు తాటాకులు కట్టుతున్నారు. "ఇదే మంచి సమయం! బాగా అల్లరిచెయ్యండి! బాగా అల్లకల్లోలం చెయ్యండి! బ్రిటిష్‌వారిని దేశంలోనుంచి త్వరగా వెళ్లిపొమ్మనిచెప్పండి! మేమువచ్చి మీకోరికలన్నీ తీరుస్తాం! మిమ్మల్ని బాగా సుఖపెట్టి ఉద్ధరిస్తాం!" అని జపాను వాళ్లు తమ రేడియోలో పాటపాడుతూనేవున్నారు. మనలను వెర్రి వెంగళప్పలనుగా భావించి మరింత వెర్రి ఆవేశం పుట్టిస్తున్నారు. బ్రిటిష్‌వారిని యీదేశంలోనుంచి "త్వరగా దయచెయ్యండి!" అని మనం బాగా అల్లరిచేసినట్లయితే యీ సమయంలో దాని ఫలితార్థం ఏమిటి? "అయ్యా! జపానువారూ! మీరు మాదేశంలోనికి త్వరగా దయచెయ్యండి!" అని ఆహ్వానించి, పిలిచి పీటవేసినట్లవుతుంది. ఈ సంగ్రామసమయంలో కదనరంగం మంచి కథపట్టులోవున్న యీ సందర్భంలో, మనదేశంలోనుంచి బ్రిటిష్‌వారు దయ చేస్తే, మనదేశంలోనికి జపానువారు తప్పకుండా దయచేస్తారు.

జపానువారి దయ ఎట్టువంటిదో వారు దయ చేస్తే తెలుస్తుంది. జపానువారు బౌద్ధమతస్థులు. బౌద్ధులకు వేదములు పనికిరావు. వేదములను ప్రమాణంగా బుద్ధమతస్థులు ఒప్పుకోలేదు. అటువంటి వేదప్రామాణ్యంలేని మతస్థులు నాస్తికులతో సమానం గనుక భగవంతుడు ఉన్నాడా లేదా అనే విషయంతో పనిలేదని వాదించినటువంటి బౌద్ధమతం యీదేశంలో వుండకూడదని షణ్మతస్థాపనాచార్యులైన శ్రీ శంకరాచార్యులవారు దానిని భారతదేశంలో రూపుమాపి నిర్మూలించారు. బౌద్ధమతం యీదేశంలో వ్యాపించినట్లయితే భారతదేశం భ్రష్టమైపోతుందనిన్నీ, ప్రజలందరూ ఈశ్వరుడు లేడు అనేటటువంటి నిరీశ్వరవాదు లైపోతారనిన్నీ, నియమ నిష్ఠలతో కూడిన కర్మకాండలను విసర్జించి కర్మబాహ్యులైపోతారనిన్నీ, పాపభీతి నశించి, అనేక పాతకములనుచేసి అధోగతి పాలైపోతారనిన్నీ శంకరాచార్యులవారు బౌద్ధమతాన్ని ఖండించారు. ఆయన ఆసేతుహిమాచలం తిరిగి, అనేక రాజసభలలోను విద్యాపీఠములలోను వాదించి, వేదప్రామాణ్యం లేనట్టి మతాలనన్నింటిని ఖండించి యీదేశంలో బౌద్ధులు లేకుండా తరిమివేశాడు. చార్వాక మతస్థులు, పాషండులు, బౌద్ధులు వీళ్లందరూ ఒక్కటేరకంలో చేరినవారని మన ఆదిశంకరాచార్యులవారు ఖండించారు.

జపానువారిది బౌద్ధమతం. కాని, బుద్ధుడు చెప్పిన నీతిబోధ ఒక్కటికూడా వాళ్లకు పట్టుబడ లేదు. ప్రాణహింస చెయ్యకూడదని బుద్ధుడు బోధించాడు. హింసచెయ్యకుండా ఉండడమే అన్ని ధర్మములలో ఉత్తమమైన పరమ ధర్మమని బోధించాడు. అహింసకు మించినటువంటి ధర్మం యింకొకటి లేదన్నాడు. "అహింసా పరమో ధర్మః" అని బుద్ధుడు బోధించి, చలిచీమనైన చావ త్రొక్కగూడదన్నాడు. తన ఆహారం నిమిత్తమై యితర జంతువులనుకూడా చంపగూడదన్నాడు. ఈరోజున జపానువాళ్లు చైనాలో చేస్తున్నటువంటి ఘోర దుర్మార్గములను చూస్తే వాళ్లు బుద్ధమతస్థులా? బుద్ధిలేని క్రూరపిశాచ పాషండులా? అని సందేహించవలసివస్తుంది. జపానువాళ్లు చైనాలో హాంకోనగరంలో మంచి ఘరానా కుటుంబాలలోని యీడువచ్చిన పడుచు ఆడపిల్లలను నడివీధిలో నిల్చుండబెట్టి వాళ్లచేత గుడ్డలువిప్పించి దిసమొలతో నృత్యంచేయించి వినోదించారు. ఆ పిల్లలు ఆవిధంగా దిగంబర నృత్యం చెయ్యకపోతే పొడిచి చంపివేస్తామని జపాను సైనికులు ఆ పడుచుపిల్లలను భయపెట్టి బాధించి హింసించారు. ఒకపిల్ల ఆప్రకారంగా నృత్యంచేయుటకు అంగీకరించకపోతే సన్నని వెదురుకర్రను ఆపిల్ల కడుపులో పొడిచి ప్రేగులు పైకిలాగి చంపివేసారు. ఇంకొకనగరంలో ఒక చైనావానిని పెద్ద మైదానంలో ఒక చెట్టుకు కట్టివేసి, వానియెదుట వాని భార్యను నిల్చుండబెట్టి, జపాను సైనికులందరూ చుట్టూ వలయంగా నిల్చుండి, ఒక జపాను సోల్జరు అయినతర్వాత ఇంకొక జపాను సోల్జరు ఆమెను ఘోరంగా మానభంగంచేసి చంపివేశారు. ఆ జపాను సైనికుల సేనాధిపతితానే దగ్గరవుండి యీపని ఆ సైనికులచేత చేయించాడు. ఈ ఘోర పాప కార్యములన్నీ కండ్లార చూచివచ్చిన ప్రముఖుడు యీ యుద్ధసంచికలోనే క్రిందటివారం ప్రకటింపబడిన వ్యాసంలో ఇంకా అనేక విషయాలు వివరించియున్నాడు. చదివిచూడండి! ఈ ఘోర రాక్షస మహాపాతకములను చేసిన పాషండు లేనా బుద్ధభగవానుని ఆరాధించే మహానుు

భావులు! బుద్ధుడు జ్ఞానసిద్ధి పొందినది గయలో—"దయ" అనేది ఉత్తమ ధర్మమని గయలో తపస్సుచేసి బుద్ధుడు గ్రహించాడు. దానిని ఇప్పటికిన్నీ "బుద్ధ గయ" అంటారు. ఆ బుద్ధగయ మన భారత దేశంలో ఉన్నదనే భక్తి ప్రపత్తులతో జపానువాళ్లు మనదేశానికి రావడంలేదు—వాళ్లు ఇప్పుడు సంకల్పించుకొన్నది తీర్థయాత్రకాదు. వాళ్లు సాగించేది దండయాత్ర. మనమీద దయచేత రావడంలేదు. గయమీద ఉన్న గౌరవంచేత రావడంలేదు. మన దేశాన్నీ, మనలనూ, విరుచుకొని తినవలెనని వస్తున్నారు. మన భారతదేశపు సరిహద్దులలో కూర్చుండి గోతులవద్ద నక్కలవలె పొంచిచూస్తున్నారు. వారి విమానాలు రాబందులవలె యీ దేశంమీదకు రావలెనని పొంచిచూస్తున్నాయి, మనకు స్వరాజ్యం యివ్వడానికి రావడంలేదు. మనకు స్వరాజ్యం లేకుండా, మన రాజ్యం స్వాహాచేసి మింగడానికి వస్తున్నారు. మనం "స్వరాజ్యం", "స్వరాజ్యం" అని అంటే వాళ్లువచ్చి "స్వాహా రాజ్యం! స్వాహా రాజ్యం!" అంటారు. వాళ్లకు దయ అనేదిలేదు. దయ అనేది గయలోనే పుట్టింది గయలోనే మర్గయా అయింది అనే జాతివాళ్లు యీ జపానువాళ్లు. గయలోనే దయకు గయాశ్రాద్ధం పెట్టినామనే బుద్ధమతస్థులు వీళ్లు. జపాను జాతికి, ఆత్మసంస్కారమున్నూ, పాపభీతియున్నూ నశించి, మానుషత్వంకూడా పోతున్నదని రవీంద్రనాథ టాగూరువంటి మహా కవీంద్రుడు విలపించాడు.

ఇటువంటి శత్రువులు మనదేశంమీదకువస్తే మనంమాత్రం అహింసావ్రత దీక్షవహించి కేవలం శుద్ధ బుద్ధావతారంలాగున కూర్చుండి శత్రువుతో సత్యాగ్రహంచేస్తామంటే, ఎట్లావుంటుందో ఆలోచించండి! దొంగవాడు కరివేపాకు కోసికొనిపోకుండా, కరివేపచెట్టుకు మడిబట్టకట్టిందట పూర్వమొక ఇల్లాలు. వచ్చిన దొంగవాడు మడిబట్టకూడా విప్పుకొని, కోసిన కరివేపాకు దానిలోనే మూటగట్టుకొనిపోయినాడు. బుద్ధావతారంలాగున మనం కూర్చుంటే, బుద్ధిలేని వెర్రివెంగళప్పలమని భావించి మన చెవులకు జపానువాళ్లే తాటాకులు కట్టి, మనకోటలన్నీ వాళ్లు ఆక్రమిస్తారు.

మనకందరికీ శౌర్యం పుట్టవలెనంటే, "యీ దేశం నాది" అనే అభిమానం మనకు కలుగవలెను గనుక యీదేశం మాకు వదలిపెట్టి మీరు వెళ్లిపొండి అని బ్రిటిష్‌వారితో గాంధీగారు అన్నారు. ఈ సమయంలో బ్రిటిషువారు వెళ్లిపోతే, మనకు శౌర్యంపుట్టినా, ఆయుధాలు యిచ్చి యుద్ధ తంత్రం నడిపించేవాళ్లు ఏరి? కనుక బ్రిటిష్ సేనలు యీ దేశంలోనే ఉండాలని గాంధీగారు మళ్లీ కళ్లుతెరిచి గుక్కతిప్పుకొన్నారు. ఈ బ్రిటిష్ సేనలకన్నింటికీ యీ దేశంలో, యీ యుద్ధ సమయంలో కావలసిన సామగ్రులన్నీ సప్లయి కావాలిగదా! ఈ సైన్యములన్నీ రైళ్లమీద పోతూవుండాలిగదా! ఇదంతా అనేక వ్యవహార శాఖలతో సంబంధించిన పనిగదా! ఈ వ్యవహార శాఖలన్నీ సైనికాధికారుల అవసరములనుబట్టీ, ఆజ్ఞలనుబట్టీ పనిచెయ్యవలెనా అక్కర లేదా? కనుక యీ యుద్ధ సమయంలో, సర్కారువారి డిపార్టుమెంటులన్నీ యుద్ధావసరములకు తగినట్లుగా బ్రిటిష్ సైనికాధికారుల ఆజ్ఞలకు లోబడి ఉండకపోతే, ఈ సైనికాధికారులు యుద్ధతంత్రం ఎట్లా సాగించగలరు? కనుక, యీ సమయంలో యీ డిపార్టుమెంటులకు సంబంధించిన పరిపాలనాధికారం యావత్తు మీచేతులలోనుంచి విడిచిపెట్టి మా చేతులలో ఒప్పగించండి అని అల్లరి చేయడంలో అర్థమేమైనా ఉన్నదా? కాబట్టి బాగా దూరాలోచన చెయ్యాలి. బ్రిటిష్ సేనలు, అమెరికా సేనలు, మిత్రరాజ్యాల సేనలు, యీ దేశంలోనే ఉండవలెనని గాంధీగారు ఒప్పుకొన్నారు. కాని, ఆ బ్రిటిష్ సైనికాధికారులకు అవసరమైన ఆయా డిపార్టుమెంటులలో వాళ్ల అధికారం, వాళ్ల ప్రమేయం, వాళ్ల పెత్తనం ఉండకూడదట - బ్రిటిష్ పెత్తనం లేకపోతే, యీ దేశంలో బ్రిటిష్‌వారి సేనలు యుద్ధతంత్రం ఎట్లా నడిపిస్తాయి? ఇదంతాచూస్తే, "చుట్టాలమీదనూ ప్రీతి, బియ్యంమీదనూ ప్రీతి" అన్నట్లుగా ఉంది. ఇటువంటి ఆలోచనలతో అల్లరిచేస్తే, మనమే అల్లరిపాలవుతాము. ఇది దూరాలోచనకాదు—ఇది కేవలం దురాలోచన—చెరువుమీద కోపంవచ్చినట్లుగా రైలు పట్టాలు తెగకొట్టితే, మనకాళ్లూ చేతులూ మనమే బంధించుకొన్నట్లవుతుంది—బాగా ఆలోచించండి!

# మద్రాసు పటాలములలో జనహాని.

వేర్వేరు తేదీలయందు మద్రాసు పటాలములలో యీ క్రిందిరీతిగా జనహాని కలిగినదని తెలియజేయుటకు చింతిల్లుచున్నాము :—

| నెంబరు. | హోదా | పేరు |
|---|---|---|
| **గాయాలతో చనిపోయినవారు.** | | |
| ఎం టి. 943173 | సిపాయి | బలరాం. |
| ఎ పి.సి.— | | |
| 187002 | ఆర్. క్వి. ఎం, హెచ్. | ఎస్ జాను రత్నం. |
| ఐ.యస్.సి.— | | |
| 17673 | సిగ్నలు | టి, వేలాయుదం. |
| 18157 | సేపరు | అబ్బయ్య గౌండరు. |
| 16271 | సేపరు | వేపయ్యచు. |
| 62060 | సేపరు | షేకు మస్తాను |
| **గాయపడినవారు.** | | |
| 65471 | సేపరు | కోన గౌండరు |
| 60450 | సేపరు | మరియప్రకాశం. |
| 16260 | సేపరు | నాగయ్యనాయుడు. |
| **తప్పిపోయి యుద్ధ ఖైదీలుగనున్నట్లు ఎంచబడినవారు.** | | |
| ఆర్.ఐ ఏ.యస్.సి.— | | |
| ఎం,టి. 891354 | సిపాయి | రాజు నాయుడు. |
| మదరాసు సేపర్లు మైనర్లు— | | |
| 18245 | సేపరు | అమ్మార్లు. |
| 60449 | లాంసు నాయకు. | ఎం. ఎం. అనీఫ్. |
| 17061 | సేపరు | అన్నామలై. |
| 759 | స్వీపరు | అనుమంతు. |
| 19784 | సేపరు | అంతోని. |
| 18588 | సేపరు | అంతోని కురుజు. |
| 12251 | సేపరు | అప్పలస్వామి. |
| 66274 | సేపరు | అప్పుకుట్టి. |
| 63436 | సేపరు | అరుల్. |
| 16804 | నాయక్ | ఆరుమైనాయగం. |
| 18994 | సేపరు | ఆశీర్వాదం. |
| 19367 | సేపరు | అజీజు. |
| 18865 | సేపరు | బాగ్యనాథన్. |
| 18877 | సేపరు | ఎన్ జె. చకో— |
| 16870 | సేపరు | చనరాయను. |
| 883 | వంట | చిన్నప్పన్. |
| 16036 | సేపరు | చిన్నప్పన్. |
| 66038 | సేపరు | చిన్నప్పన్. |
| 17915 | సేపరు | చిన్న స్వామి. |
| 17004 | నాయక్ | డానియల్. |
| 18521 | సేపరు | దొరై |
| 15359 | సేపరు | ఏకాంబరం. |
| 17594 | హవల్దార్ | ఫ్రాంసిస్. |
| 12456 | హవల్దార్ | ఎతిరాజు. |

| నెంబరు. | హోదా. | పేరు. |
|---|---|---|
| 18379 | సేపరు | గోపాలన్ నాయర్ |
| 16071 | సేపరు | గోవింద రాజు. |
| 13965 | సేపరు | గోవిందస్వామి |
| 1559 | డబ్ల్యు.సి | గోవిందస్వామి |
| 19089 | సేపరు | గోవిందు నాయుడు |
| 16843 | లాన్సు నాయక్. | ఇనియను |
| 65285 | సేపరు | జగన్నాథన్. |
| 65608 | సేపరు | జంపన సత్యరాజు. |
| 13033 | సేపరు | జాను. |
| 18356 | సేపరు | కలియప్ప. |
| 17473 | లాన్సునాయక్. | కమలకన్నను. |
| 1222 | డబ్ల్యు.సి. | కన్నను |
| 60476 | సేపరు | కరుప్పుస్వామి |
| 12985 | సేపరు | కదిరివేలు. |
| 66115 | సేపరు | కృష్ణ రెడ్డి. |
| 65612 | సేపరు | కృష్ణ తేవరు |
| 17162 | సేపరు | కృష్ణను |
| 18205 | సేపరు | కృష్ణను |
| 60453 | సేపరు | కుమారస్వామి |
| 17085 | నాయకు | కుప్పను |
| 4623 | వంట | మనా. |
| 16062 | సేపరు | మహమ్మదు గౌజు |
| 18862 | సేపరు | మహమ్మదు ఇస్మేలు |
| 16581 | సేపరు | మునిసామి. |
| 60783 | సేపరు | మునిసామి |
| 18691 | సేపరు | మునియను |
| 60447 | సేపరు | మురుగను. |
| 65287 | సేపరు | మురగను |
| 18215 | సేపరు | ముద్దుక్రిష్ణయ్య. |
| 14217 | సేపరు | నాగప్పను. |
| 18869 | సేపరు | నటరాజను. |
| 64217 | సేపరు | నూకన్న. |
| 65276 | సేపరు | కులనియప్ప. |
| 14587 | లా/నా | పసుపులేటి సుబ్బయ్య. |
| 1558 | వంట | పెరుమాళు. |
| 15479 | సేపరు | పెరుమాళు. |
| 13893 | హవల్దార్ | పోలయ్య. |
| 66181 | సేపరు | పులోసు. |
| 18013 | లా/నా | పురుషోత్తం. |
| 60652 | హవల్దార్ | రాధాకృష్ణను. |
| 18145 | సేపరు | కె. ఆర్. రహిమాను. |
| 4731 | పెయింటరు | రాజా. |
| 17911 | లా/నా | రామశింగు. |
| 60521 | సేపరు | రామయ్య తేవరు. |
| 16038 | సేపరు | రామానుజం. |
| 16530 | సేపరు | రామసామి. |
| 17738 | సేపరు | రామసామి. |
| 17827 | సేపరు | రామసామి. |
| 19844 | సేపరు | రామసామి. |
| 17754 | సేపరు | రత్నం. |
| 17516 | లా/నా | సేలురాజు. |
| 18638 | లా/నా | షణ్ముగం. |
| 17092 | నాయకు | సౌరిముత్తు. |
| 13840 | సేపరు | శ్రీరాములు. |

| నెంబరు. | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| 60665 | హవల్దార్ | ... | సుబ్బరాజు. |
| 18467 | సేపరు | .. | సుబ్బయ్య పిళ్లె. |
| 60820 | సేపరు | ... | సుబ్బయ్య తేవరు. |
| 60512 | సేపరు | ... | సుబ్రమణి. |
| 1153 | వంట | . | సుందరం. |
| 65586 | సేపరు | ... | తంగవేలు. |
| 17155 | నాయకు | ... | త్యాగరాజను. |
| 16953 | లా/నా | . | తిరునవుక్కరసు |
| 60609 | సేపరు | ... | వి. జ్ఞానానందం. |
| 60563 | సేపరు | ... | వేలప్పను. |
| 18105 | సేపరు | ... | వెంకటస్వామి. |
| ఐ.యస్ సి.— | | | |
| ఎ/2246 | సిగ్నలరు | ... | అబ్దుల్ సత్తారు |
| ఎ/8604 | సిగ్నలరు | ... | టి. అబ్రహాం. |
| 9615 | నాయకు | .. | అచ్యుతన్నాయరు |
| 9697 | సిగ్నలరు | . . | ఎల్. అప్పారావు. |
| 15185 | సిగ్నలరు | . | టి. హెచ్. అదృష్ట రావు. |
| ఎ/3257 | సిగ్నలరు | ... | కె. అజరయ్య. |
| ఎ/4251 | సిగ్నలరు | | బాహాను వక్రము |
| ఎ/1689 | నాయకు | .. | పి.సి. భక్తవత్సలు. |
| ఎ/7052 | సిగ్నలరు | ... | బాజుగులు. |
| ఓ/2179 | డబ్ల్యు సి ఆర్ | .... | చిన్నయ్య. |
| ఎ/7059 | సిగ్నలరు | ... | సి. కె. దామోదరం. |
| ఎ/2256 | సిగ్నలరు | ... | దాసు. |
| 17775 | సిగ్నలరు | . . | జి. జార్జి. |
| 15457 | సిగ్నలరు | . | వి. కె. జార్జి. |
| ఎ/3859 | సిగ్నలరు | ... | వి. ఆర్. జార్జి. |
| 17797 | సిగ్నలరు | ... | యు. గోపాల్ శెట్టి. |
| ఎ/2130 | నాయకు | ... | టి. గోవిందరాజను. |
| ఎ/1853 | సిగ్నలరు | ... | గోవిందస్వామి. |
| ఎ/5265 | సిగ్నలరు | ... | కందిరవేలు. |
| ఎ/7502 | సిగ్నలరు | ... | కత్యను |
| 15028 | సిగ్నలరు | ... | కేశవులు నాయుడు. |
| ఎ/3952 | సిగ్నలరు | .. | కద్దలు షరీఫ్. |
| ఎ/1045 | నాయకు | ... | ఖుదా బక్షు. |
| 15445 | సిగ్నలరు | ... | ఎం. కోటయ్య. |
| ఎ/1482 | సిగ్నలరు | ... | కుంజిరామ నంబి. |
| ఎ/7978 | సిగ్నలరు | ... | కుట్టికృష్ణ నాయరు. |
| ఎ/3624 | సిగ్నలరు | ... | లూర్దుస్వామి. |
| ఎ/209 | నాయకు | ... | మాధవను. |
| 17793 | సిగ్నలరు | . . | ఆర్ మాణిక్యం. |
| ఎ/1125 | నాయకు | .. | మ. సాదికు. |
| ఎ/2616 | సిగ్నలరు | ... | మునిరత్నం. |
| 9649 | నాయకు | ... | మురుగేశను. |
| ఎ/2000 | సిగ్నలరు | ... | ఎం. నానయ్య. |
| ఓ/3513 | స్వీపరు | . | ఓబిగాడు. |
| ఎ/3243 | సిగ్నలరు | ... | సి. రాఘవయ్య |

## శత్రువు నీ చెవిలో ఊదుచున్నాడా ?

Is the enemy whispering to you.

పుకారులను వినుట యనగా జపానువాడు మీ చెవిలో ఊదుటయే.

మీ మనస్సును చెడగొట్టి, మీ దారుఢ్యమును పోగొట్టుటకే వారు ప్రయత్నించుచున్నారు.

నిర్ధారణలేని వార్తలను విని, వాటిని నమ్మి, వ్యాపింపజేయుచు శత్రువునకు సహాయము చేయకుడు.

## * పుకారులను నమ్మకండి *

జపానును ఎదుర్కొనేందులకు దేశీయ యుద్ధరంగమును తయారు చేయుడు.

| నెంబరు | హోదా. | | పేరు. |
|---|---|---|---|
| ఎ/1748 | సిగ్నలరు | ... | రామచంద్రన్. |
| 9762 | నాయకు | ... | డి. శామ్యూలు అరులుమినార్. |
| ఎ/1691 | నాయకు | ... | శామ్యూలుబెనిడిక్టు. |
| ఎ/2900 | సిగ్నలరు | ... | శంకుని నాయరు. |
| ఎ/854 | నాయకు | .. | శంకరకుట్టి నాయరు. |
| ఎ/1944 | నాయకు | ... | షేకు సిల్లరు. |
| 17791 | సిగ్నలరు | ... | శ్రీధరం పిళ్లె. |
| ఎ/8898 | సిగ్నలరు | .. | ఎం. సుబ్బారావు |
| 16429 | సిగ్నలరు | ... | వి. వి సుబ్బారావు. |
| ఎ/1183 | నాయకు | ... | స సులేమాను. |
| 16179 | సిగ్నలరు | ... | జి. తిరుమలనాయక్ |
| ఎ/7689 | సిగ్నలరు | ... | బి. వాసుదేవపిళ్లె. |
| ఎ/288 | నాయకు | ... | వెంకటకృష్ణ రావు. |
| 9393 | సిగ్నలరు | ... | వెంకట నరసింహులు. |
| 16772 | సిగ్నలరు | ... | వేణుగోపాల్ |
| ఎ/3834 | సిగ్నలరు | ... | ఐ. జి. విసుడియన్ |
| ఎ/7456 | సిగ్నలరు | ... | యుసఫ్ అలిఖాను. |
| ఐ.ఎ.ఒ.సి.— | | | |
| ఒ/71429 | సిపాయి | .. | అలిగిరిస్వామి పిళ్లె. |
| ఒ/71575 | సిపాయి | . | అలవల కూరయ్య. |
| ఒ/71642 | నాయకు | .. | కె. పి. కేశవను. |
| ఒ/31773 | ఫిట్టరు. | ... | ముత్తుస్వామి. |

MADRAS : PRINTED AND PUBLISHED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.